Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ మే నెల 16 వ తేది శుక్రవారం [నెం 9 వ

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

7 వ తేదీ బుధవారం రాత్రి, ఫ్రాన్సు తీరమునందలి ' బ్రెస్టు ' రేవుపైన, బ్రిటిషు విమానాలు అతిభయంకరమైన దాడి జరిపి, ఆ రేవులోవున్న షార్న్‌హార్స్టు, గ్నీసెనా అను జర్మను యుద్ధ నౌకలమీద, కవచాలనుగూడ భేదించుకొనిపోయే క్రొత్త రకపు బాంబులను వేశాయి. చాల బాంబులు ఆ యుద్ధ నౌకలకు, రేవులోవున్న ఇతర నౌకలకు గూడ సూటిగా తగిలినవి. రేవుగూడా చాల శిథిలం చేయబడ్డది. జర్మనీలో వాయవ్య ప్రాంతపు పట్నాలమీద పెద్ద దాడిరే జరిగినదని జర్మనులే అంగీకరించారు. బ్రిటిషు వైమానికులు, డాంజెక్, లోయిర్ అనే పట్నాలలోగల, నూనె ఫాక్టరీలపైన గూడ చాల బాంబులు వేసి వచ్చారు. సెయింటు నాజియరునందలి నూనె గిడ్డంగులలో లేచిన మంటలు అనేకమైళ్లు దూరంవరకు కనిపించాయి. గురువారం రాత్రి 400 బ్రిటిషు విమానాలొక్కమారుగా జర్మనీపైకి దాడివెడలి, హాంబర్గు, బ్రెమెన్ మొదలగు నౌకా పారిశ్రామిక నగరాలమీద, బర్లిన్, ఎండెన్ మొదలగు అనేక ఇతర పట్నాలమీద భయంకరమగు దాడి జరిపాయి. కొన్ని విమానాలు, పోలండు సరిహద్దు వరకు గూడ వెళ్లి జర్మను పట్నాలమీద చాల బాంబుల వర్షించాయని జర్మనులే అంగీకరించారు. శుక్రవారం రాత్రి బ్రిటిషు విమానాలు, జర్మనీలోని మాన్‌హైం, లుడ్విగ్ హావెన్ మొదలగు పారిశ్రామిక ప్రదేశాలపై తమదాడిని కేంద్రీకరించి వేలకొలది బాంబులను వర్షించాయి. చాల ఫ్యాక్టరీలు పూర్తిగా తగులబడి పోయాయి. ఈ దాడిలో జర్మనులకు అపారమగు నష్టం కలిగిందని అధికారులు తెలుపుచున్నారు. శనివారం తెల్లవారుజామున చాల బ్రిటిషు విమానాలు కెలే మొదలగు ఫ్రాన్సు రేవులపైకి దాడి సాగించి చాల బాంబుల వర్షించాయి. అచటి రేవులలోని ప్రేలుడు ధ్వనులు, ఆంగ్లదేశపు పట్నాలలో వినిపించినవి. శనివారం రాత్రి పిండారబోసినట్లున్న వెన్నెలలో చాల బ్రిటిషు విమానాలు హాంబర్గుపైకి దాడి సాగించి, అచ్చటి ఫాక్టరీలమీద వేలకొలది బాంబులు వర్షించి అమితమగు నష్టం కలిగించాయి. రేవులోవున్న ఒక యుద్ధ నౌక రెండు స్టీమరు నౌకలు శిథిలమైనాయి. మరి కొన్ని విమానాలు, బ్రెమెన్, ఎండెన్, రోటర్డాం మొదలగు రేవు పట్నాలపైకి జని పందలకొలది టన్నుల బాంబులను వర్షించాయి. లాపెల్లిస్ అనే రేవుపట్నంమీద వేయబడిన బాంబులవలన మరి రెండు నౌకలు శిథిలమైనాయి. అచటనున్న నూనె యంత్రాలయం పూర్తిగ తగులబడి పోయింది.

ఆదివారం రాత్రిగూడ వందలకొలది బ్రిటిషు విమానాలు తిరిగి హాంబర్గుపై మరల అగ్ని వర్షం కురిపించాయి. 9 మైళ్ల పొడుగునగల, నౌకలు ఆగురేవు పొడుగునా పెద్ద అగ్నిజ్వాలలు బయలుదేరేయి. అదిగాక, బ్రోమెం, హాస్ పట్టణమునందలి నౌకా నిర్మాణ శాలలపైనగూడ వందల కొలది టన్నుల బాంబులను వర్షించి శిథిలం చేశారు, 12 వ తేదిన రైన్ ప్రాంతమునందలి మాన్‌హీం మొదలగు పారిశ్రామిక పట్నాలపై దాడి జరిపి వేలకొలది బాంబుల వర్షించివచ్చాయి. ఆ మరునాడు పగలు బ్రిటిషు విమానాలు జర్మను నౌకా కేంద్రమగు హెలిగోలాండు పైకి దాడివెడలి పెద్దపెద్ద ప్రేలుడు బాంబులు వేశాయి. 12 వ తేదీ రాత్రివేళ, వాతావరణం అనుకూలంగా లేకపోవుటచే, కరానుకోస్తా రేవులమీద తప్ప, జర్మనీపై పెద్ద దాడులను జరుపలేదు.

7 వ తేదీ బుధవారం రోజున శత్రువులు పగలు, రాత్రి కూడా ఇంగ్లాండులో అనేక ప్రాంతాలమీద చాల తీవ్రమగు విమానదాడినే సాగించారు. వీనిలో పగటివేళ 8 శత్రు విమానాలు పడగొట్టబడ్డాయి. సాయంత్రం పడటంతోనే, పిండారబోసినట్లున్న వెన్నెలలో బ్రిటిషు పశ్చిమ తీరాన మెర్సి సైడు ప్రాంతాన గల పట్నాలమీద, హంబరునదీ ప్రాంతముమీద, ఈశాన్యభాగపు పట్నాలమీద, బ్రిస్టలు కాలువ ప్రాంతంలోను, శత్రులు తమ దాడిని ముఖ్యంగా కేంద్రీకరించారు. ఆస్తికి, ప్రాణాలకు చాల నష్టమే కలిగివుంటుందని అనుకున్నారు. గాని, శత్రువిమానాలలో 24 పడగొట్టబడ్డాయి. ఇంతవరకు రాత్రివేళ ఇన్ని విమానాలను ఎపుడుగూడ శత్రులు నష్టపడియుండలేదు. గురువారంనాడు పగలు జరిగిన దాడులలో 14 విమానాలు, రాత్రిదాడులలో 11 శత్రువిమానాలు పడగొట్టబడ్డాయి. నాటిరాత్రి హంబరు ప్రాంతంలోను మిడ్లండ్సు ఉత్తరభాగంలోను శత్రు విమానాలు పెద్దగుంపులుగా వచ్చి సాగించిన దాడులవలన కొంత నష్టమే కలిగింది. అధికారులీ ప్రాంతాలలోని బాలురను బాలికలను పూర్తిగా ఖాళీచేయిస్తున్నారు. దాడులంత తీవ్రంగా వున్నా ప్రజలు యథాపూర్వంగానే తమ పనులు చూచుకుంటున్నారు. శుక్రవారంనాడు, పగలు శత్రుదాడులంత యెక్కువగా లేవు. రాత్రివేళ చాల ప్రాంతాలలో బాంబులు పడ్డాయిగాని, ఏ ఒక్క ప్రదేశంలోను శత్రులు దాడిని కేంద్రీకరించలేదు. నష్టం విస్తారంగా లేదు. 10 వ తేదీ పగలు, చాల శత్రువిమానాలు అన్వేషణార్థం బ్రిటను మీదకు వచ్చాయి. కాని, ఆకాశంలో 5, 6 మైళ్లయెత్తున బ్రిటిషు గూఢ విమానాలు వానిని యెదిర్చి వెనుకకు తిరుగగొట్టివేశాయి. ఇంగ్లండు నైరుతిభాగంలో, వెళ్లుచున్న ఒక రైలుమీద శత్రువిమానాలు మరఫిరంగు లుపయోగించాయి. కొంతమంది ప్రయాణీకులకు దెబ్బలు తగిలాయి. నాటి రాత్రి పడగొట్టబడిన విమానాలనుగూడ చేరిస్తే, అంతవరకు రాత్రి దాడులలో ఈ నెల 10 రోజులలోను 91 శత్రు విమానాలు పడగొట్టబడినాయి. ఏప్రిలు నెల అంతకూ కలిపితే, రాత్రిపూట 90 కంటే ఎక్కువ శత్రు విమానాలు పడగొట్టబడలేదు. ఈ పదిరోజులలోనే శత్రునష్టం, వెనుకటి నెలను మించిపోయింది. శనివారం రోజు రాత్రి శత్రు విమానాలు వందలుగావచ్చి, లండనునగరంమీద భయంకరమైన దాడి జరిపాయి. సాయంత్రమునుంచి తెల్లవారు సమయానికి గాని దాడి ఆగలేదు. శత్రువిమానాలు చాల క్రిందుగా యెగు

రుతూ పెద్ద పెద్ద బాంబులు వర్షించినవి. గత నెల 19 వ తేది దాడినిగూడ ఇది మించిపోయింది. చాల వైద్యశాలలు, పార్లమెంటు భవనము శిథిలమైనవి. కాని వెస్టు మినిస్టరు భవనంమీదనున్న జగత్ప్రసిద్ధమగు బిగ్ బెన్ గడియారం మాత్రం చెడిపోలేదు. యథాపూర్వంగా అది గంటలుకొడుతూనే వుంది. శనివారం రాత్రి దాడిలో 33 శత్రువిమానాలను బ్రిటనుపై దాడిలో పడగొట్టిరి. ఆదివారం రాత్రి శత్రులు లండనుమీద, యితర ప్రాంతాలమీద బాంబులు వర్షించారు. కాని నష్టం వెనుకటి రోజంతగా లేదు. నాటి దాడులలో వెస్టు మినిస్టరు మేయరు, బెర్మాండ్సే మేయరు మరణించారు. పోలండు ప్రభుత్వపు డిప్యూటీ ప్రధాన మంత్రియగు సోస్నోస్కీ నేనానికి దెబ్బలు తగిలాయి. 13 వ తేదిన దేశమం దచ్చటచ్చట బాంబులు పడెనుగాని నష్టం ఎక్కువలేదు. దాడుల తీవ్రతగూడ తగ్గింది. బుధవారం నాడు శత్రుదాడులు మరీ తగ్గినవి.

శనివారం రాత్రి 10 గంటలకు, జర్మనీలో నాజీ పక్షనాయకుడును, హిట్లరు, గోరింగుల తరువాత జర్మనీ సామ్రాజ్యానికి నియంతగా హిట్లరుచే ప్రకటింపబడిన ప్రముఖుడును అగు హెర్ హెస్సుగారు, ఒక విమానంలోయెక్కి వచ్చి ఇంగ్లండులో గ్లాస్గోవద్ద దిగాడు. గాలిగుమ్మటం సహాయంతో దిగటంలో అతని మోకాలుకు దెబ్బ తగిలింది. అతనిని అధికారులు పట్టుకొని వైద్యశాలలో వుంచారు. అతనికి చిత్త చాంచల్యంగలిగి విమానంలో యెక్కడకో పోయాడని జర్మనులు ప్రకటించారు. బ్రిటనుకు, జర్మనీకి సంధికుదిర్చె పిచ్చి వుద్దేశంతో అతను బయలుదేరాడని జర్మను లంటున్నారు. అతని పదవిలో మార్టిన్ చార్మన్ అనునతని నియమించారు. 13 వ తేదీన నాజీ పక్షనాయకులు సమావేశమై యుద్ధమును తుదివరకు విజయవంతంగా సాగించుటకు తీర్మానించుకున్నారు.

## ఆఫ్రికా మధ్యధరా రంగాలు.

లిబియా (ఉత్తర ఆఫ్రికా)యందు, టోబ్రూకు దుర్గమును బ్రిటిషు సైన్యాలు ఇంకను అకుంఠిత నిశ్చయంతో రక్షించుకొనుచున్నవి. జర్మనులు, ఇటాలియనులుగూడ పదేపదే పైబడి కవియుచునేవున్నారు. కాని వారిదాడు లన్నిటిని బ్రిటిషు సైన్యాలు తిరుగగొట్టి చాలమంది శత్రులను ఖైదీలుగా పట్టుకుంటున్నారు. ఆ ప్రాంతమున ప్రతి దినము మండు వేసంగి యెండలలో ఇసుకతో సుడిగాడ్పులు లేచుచున్నవి. అందుచే సరియగు పోరాటము సాగించుటకు ఉభయ పక్షములకునుగూడ చాల ప్రతిబంధకముగానే వున్నది. యెండ వేడిమిని భరించలేకయు, త్రాగుటకు మంచి నీరు లేకయు, జర్మను సైనికులు చాలమంది ప్రతి దినము, బ్రిటిషు సైనికులవద్దకు వచ్చి లొంగి పోవుచున్నారు. టోబ్రూకువద్ద 11 వ తేదీన బ్రిటిషు సైనికులు ఆకస్మికంగా శత్రువులపైబడి, ఒక చిన్న ఇటాలియను సైనిక దళాన్ని ఖైదీలుగా పట్టుకున్నారు.

ఈజిప్టు-లిబియా సరిహద్దులలో, ఉభయపక్షములును ఇంకను సైన్యముల కేంద్రీకరించుచున్నవి. అగ్రభాగమున కాపలాయందు చిన్న పటాలములకు అపుడపుడు సంఘర్షణలు దప్ప, ఇచటగూడ ఉభయపక్షములును ఇంకను తీవ్రమగు పోరాటమునకు దలపడలేదు. సోలంప్రాంతంలో జర్మనులు 14 వ తేదీన 5 ప్రాంతాలనుండి ముందుకువచ్చి బ్రిటిషు సైనిక పంక్తులను యెదిర్చారు. కాని, వారిని, బ్రిటిషు సైన్యాలు తిరుగగొట్టినవి. జర్మనులంతట తామున్న ప్రదేశాలనుగూడ వదలి సోలంకునైరుతి దిక్కుగా చాల వెనుకకు పోవలసివచ్చింది. ఉభయపక్షాలు గూడ ఈ ప్రాంతంలో ఇంకా సైన్యాలను తెచ్చి చేర్చుకొను పనిలో నిమగ్నమైవున్నాయి.

ఇటలీనుండి లిబియాకు సైన్యములును ఆయుధ సామగ్రియును దిగుమతిగాకుండ చేయుటకుగాను బ్రిటిషు విమానములు, యుద్ధ నౌకలును బెంఘాజీ, ట్రిపోలీ రేవుల పైకిదాడి సల్పి బాంబులను, ఫిరంగి గుండ్లను వర్షించి శిథిలము చేయుచున్నవి. 9 వ తేదీన రెండు శత్రు "స్లై" నౌకలు బెంఘాజీ రేవును సమీపించుచుండాగా ముంచి వేయబడెను. 10, 12, 13 వ తేదీలలో గూడ బ్రిటిషు నౌకలు బెంఘాజీ రేవుపై గుండ్లవర్షం కురిపించాయి. బెనినానా, డెర్నా రేవులలో బ్రిటిషు విమానములు వేసిన బాంబులవలన చాల భాగం ధ్వంసం చేయబడినది.

అబిసీనియాయందు బ్రిటిషు సైన్యములు, ఇంకను అచటచట మిగిలియున్న ఇటాలియను సైన్యములను వెంటాడి పట్టుకొనుచున్నవి. అబిసీనియా యందంతటను అక్కడక్కడ యింకను 30 లేక 38 వేల సైన్యము మాత్రమే యుండునని లెక్కించబడెను. వీనిలో అధిక భాగము అంబాఅలగీ అను కొండ దుర్గమువద్దనున్నది. ఉత్తర దిశగా వచ్చుచున్న భారతీయ సైన్యములు, 10 వ తేదిన అంబా అలగీకి 15 మైళ్ల దూరమున వున్న రెండు ముఖ్యమగు దుర్గములను ఆక్రమించెను. 150 మంది ఇటాలియనులను ఖైదీలుగా పట్టుకొనిరి. బ్రిటిషు విమానములు, ఆకాశము నుండి అంబాఅల ప్రాంతముపై దాడి సాగించి ఇటాలియను నిలయములపైన బాంబుల వర్షించి చెల్లా చెదరు చేయుచు, క్రింది సైన్యములకు చాల తోడ్పడుచున్నవి. బ్రిటిషు సైన్యాలు 14 వ తేదీకి ఉత్తరాన్నుండి, దక్షిణాన్నుండిగూడ, అంబాఅలగీని చాల సమీపించాయి.

అబిసీనియా చక్రవర్తియగు హెయిల్ సెలాసేగారు తన రాజధానియగు అడిస్ అబాబాను ప్రవేశించి, తిరిగి తన సింహాసనమును అధిష్ఠించిరి.

మధ్యధరాసముద్రమందలి బ్రిటిషు నౌకానిలయమగు మాల్టా దీవిపైనను, సూయజుకాలువ రేవు పైనను, జర్మను విమానము లెదిర్చి బాంబులు వేయుచున్నవి. 7 వ తేదీన సూయజుపై జరిగిన విమాన దాడిలో ప్రభుత్వ రైల్వేలకు, టెలిగ్రాము నిర్మాణములకు, టెలిఫోనులకు కొంత నష్టము గలిగెనని ఈజిప్టు అధికారులు ప్రకటించిరి. కాని ప్రాణ నష్టము మాత్రము గలుగ లేదని తెలిపిరి. ఎర్రసముద్రంలో ఉత్తర భాగాన, సూయజు కాలువలోను నౌకలు ప్రయాణం చేయుట ప్రమాదకరమని జర్మనులు 14 వ తేదీన ప్రకటించారు.

శుక్రవారమునాడు మాల్టా దీవి హార్బరుపైన చాల శత్రు విమానములు దాడివచ్చెను. వానిలో మూడు విమానములు పడగొట్టబడెను. 12 వ తేదిన గూడ పెద్ద దాడియే జరిగెను. కాని నష్టం ఎక్కువ కలుగలేదు. గత 11 నెలలలో మాల్టాపైన ఇది 600 వ దాడి.

## టర్కీ, ఈరాక్, ఈరాన్.

ఈరాకులో బ్రిటిషు సైన్యాలు అన్ని ప్రాంతాలలోను, తిరుగబాటుదారులను అణచివేస్తున్నాయి. అచట న్యాయ సమ్మతమగు ప్రభుత్వమును తొలగించి ప్రధాన మంత్రియైన రషీదు ఆలీగారికి, రాజధానియగు బాగ్దాదులోనే 7 వ తేదిన ప్రజలు ప్రతికూలార్భటాలు చేసినట్లును, అతడచటినుండి వెడలిపోయినట్లును ఈజిప్టునుండి వార్తలు తెలుపుచున్నవి. రషీదు ఆలీగారి మంత్రివర్గంలో దేశరక్షణశాఖ మంత్రియగు షాకత్ గారు 8 వ తేదీన అంగోరావచ్చి, అచట టర్కీ ప్రధాన మంత్రితోను, విదేశాంగమంత్రితోను సంప్రదింపులు సాగించాడు. బ్రిటనుకు ఈరాకుకు రాజీ కుదర్చవలసినదని అతడు టర్కీని కోరాడు. టర్కీ, ఈజిప్టు ప్రభుత్వ

ములు మధ్యవర్తిత్వం వహించి రాజీ చేస్తామని అన్నాయి. కాని బ్రిటిషు ప్రభుత్వంవారు నిరాకరించి, హబ్బనియా ప్రాంతాలనుండి ఈరాకు సైన్యాలను మరల్చుకుపోతేగాని తాము రాజీ విషయం మాటలాడమనీ, అప్పుడైనా తమ యొడంబడిక హక్కులను యేమాత్రం వదలమనీ తెలియజేశారు. అందుచే రాజీ ప్రయత్నాలు భగ్నమైనవి. 7 వ తేదీన బ్రిటిషు విమానాలు బాగ్దాదువద్దనున్న శత్రువిమానాశ్రయముమీద బాంబులువేసి శిథిలం చేశాయి. 4 వ తేదీ హబ్బనియావద్ద పోరాటంలో శత్రువులనుండి 6 ఫిరంగులను 400 ఖైదీలను బ్రిటిషు పటాలాలు పట్టుకున్నాయి. బ్రిటిషు సైన్యాలు 9 వ తేదీన రట్బా అనే పట్టణమందలి విమానాశ్రయాన్ని బ్రిటిషు వైమానికులు తిరిగి ఆక్రమించుకున్నారు. ఆ మరునాడు రట్బా కోటగూడ బ్రిటిషు సైన్యాల స్వాధీనమైనది. హబ్బనియావద్దనున్న తిరుగబాటుదారుల సైన్యాలు 10 వ తేదీన వెనుకకు తరిమివేయబడెను. 11 వ తేదీన బ్రిటిషు విమానాలు శత్రు సైనిక శిబిరాలమీద విమానాశ్రయాలమీద బాంబులు వేశాయి. తరువాత బాస్రాలోను బాగ్దాదు ప్రాంతంలోను హబ్బనియాలోనుగూడ ప్రశాంతంగానే వుంది. బ్రిటిషు విమానాలు శత్రుల వెదకి బాంబులు వేస్తున్నాయి.

ఈరాక్ ప్రభుత్వాధికారులు, హెడ్జాజు రాజగు ఇబన్ సాద్‌గారు గూడ తిరుగబాటుదారుల నాయకుడగు రషీదు అలీగారికి ఆశ్రయమిచ్చుటకు నిరాకరించిరి.

రష్యా సోవియటు ప్రభుత్వంవారు ఈరాకుతో రాజకీయ రాయబార సంబంధములను నెలకొల్పుకొనుటకు అంగీకరించినటుల 11 వ తేదీన రష్యాలో ప్రకటింపబడింది. ఆ మరునాడే రషీదు అలీగారి ప్రభుత్వం ఇతర దేశాలచే ప్రేరేపింపబడినదని మాస్కో రేడియో ఖండించింది. దీనిని బట్టి రాయబార సంబంధాలేర్పరుచుకొను నిర్ణయం ఈరాకు యెడల అనుకూలభావం కనుపరుచుటకుద్దేశింపబడినది గాదని తెలియవచ్చును.

టర్కీ మంత్రివర్గం 9 వ తేదీన సమావేశమై ఈరాకు సమస్యను చర్చించింది. కాని ఏ నిర్ణయం ప్రకటింపలేదు. టర్కీయందలి జర్మను రాయబారియగు వాన్ పేపన్ గారు మూడు వారములుగా బర్లిను నగరమందుండి 12 వ తేదీన అంకారాకు తిరిగి వచ్చెను. ఇతడు టర్కీకి జర్మను షరతులను వెంట తీసుకొనివచ్చెనని అనుకొనుచున్నారు. టర్కీ అధ్యక్షుడు ఇనూనూగారు పశ్చిమ సరిహద్దు దుర్గముల పరీక్షించి 9 వ తేదీని రాజధానికి తిరిగి వచ్చెను

ఈరాక్‌లోకి జర్మను ఏజెంటులు విరివిగా వచ్చి చేరుచున్నారను ఆరోపణలు పూర్తిగ నిరాధారములని ఈరాకు ప్రభుత్వం ప్రకటించింది.

## విషీ

ఫ్రాన్సు ప్రధానియగు అడ్మిరల్ డార్లన్ గారు జర్మను అధికారులతో చేసుకున్న ఒడంబడికలో, జర్మనుల కొసగబడిన సౌకర్యాలను గురించిన షరతులు రహస్యంగా వుంచబడెను. ఫ్రాన్సు అధికారులు తమ దేశంలో ఆయుధాలను తయారుచేసి జర్మనీకి సప్లైచేయుట కంగీకరించిరని స్వతంత్ర ఫ్రెంచి వార్తా సంఘము ప్రకటించింది. 13 వ తేదీన విషీ మంత్రివర్గం సమావేశమై ఒడంబడికను ఏకగ్రీవంగా ఆమోదించారు. ఆ రోజుననే డార్లన్ గారు బర్లిను వెళ్లి వాన్ రిబన్‌ట్రాపు గారి సమక్షంలో హిట్లరుతో మాటలాడిరి. ఉభయదేశాలకుగల సంబంధములను గురించి వారు చర్చించిరి.

ఫ్రాన్సుకు నెలకు రెండేసి నౌకల నిండుగ ఆహార పదార్థములను పంపుటకు అమెరికను అధికారు లంగీకరించిరి.

స్పెయినులోనికి సైన్యాలు పంపుటకుగాను అనాక్రమిత ఫ్రాన్సునందలి పాన్-సార్గోసా రైలుమార్గము నుపయోగించుకొననీయవలసినదని జర్మనులు ఫ్రాన్సు అధికారులను వత్తిడిచేయుచున్నట్లు తెలియుచున్నది.

పోర్చుగీసు దేశమునందలి రేవులలో నౌకలుంచుకొనుటకు అనుమతి నొసగవలెనని తమను ఏ ప్రభుత్వమునుగూడ ఇంతవరకు అడిగియుండలేదని పోర్చుగీసు ప్రభుత్వము 8 వ తేదీన ప్రకటించెను. పోర్చుగలును, ఆ జోర్స్ కేపువర్డీ దీవులను అక్సిసు రాజ్యము ఆక్రమించుననియు, దానికి ముందుగనే వానిని ఆంగ్ల-అమెరికా దేశములు ఆక్రమింపవలెననియు యునైటెడు స్టేట్సు సభ్యుడు పెప్పరుగారు గావించిన సూచనకు ప్రత్యుత్తరంగా ఈ ప్రకటన చేయబడెను. ఎవరైన తమ దేశముపైకి వచ్చినయెడల తీవ్రముగ ప్రతిఘటించెదమని పోర్చుగలు అధికారులు ప్రకటించిరి.

స్పెయిను ప్రభుత్వంవారీ నెల 9 వ తేదీన, దేశీయ పరిపాలనా పద్ధతులలో చాల మార్పుల నొనర్చిరి. ప్రతి ప్రాంతమునను పరిపాలనను సాగించుటకుగాను 'సివిలు' గవర్నరులను నియమించిరి. ఫలాంగ్ పక్షపు వార్తాపత్రికలకుగూడ సెన్సార్‌షిప్పును వర్తింపచేసి, ఇదివరకు గల మినహాయింపులను రద్దుచేసిరి. దీనితోపాటు ఫ్రాంకోనే నాని, సైనికనిర్మాణములోగూడ మార్పుల నొనర్చి సంస్కరించెను.

## తటస్థ రాష్ట్రాలు (రష్యా-ఐర్లండు వగైరా).

ఇంతవరకును కమ్యూనిస్టు పక్షపు కార్యదర్శిగ మాత్రమే వున్న స్టాలిను, 8 వ తేదీన, సోవియటు ప్రధానమంత్రి పదవినికూడ తానే వహించెను. మాలటావ్‌గారికమీద ప్రధానిగ నుండరు. విదేశాంగ మంత్రిగ మాత్రమే పని చేసెదరు. రష్యా దేశపు పడమటి సరిహద్దులలో సోవియటు అధికారులు పెద్దపెద్ద సైన్యములను కేంద్రీకరించియుండిరను వదంతులు పూర్తిగ అసత్యమని 8 వ తేదీన టాస్ వార్తా సంఘమువారు తెలిపిరి. మాస్కో యందింతవరకునుగల నార్వే, బెల్జియం, యుగోస్లావియా ప్రభుత్వ రాయబారవర్గములను రద్దు చేసితిమనియు, వారి ప్రభుత్వములు స్వదేశములలో లేవు గనుక, ఆ రాయబార వర్గములను గుర్తించుటకు వీలులేదనియు ప్రకటించిరి.

## అమెరికా సంయుక్త రాష్ట్రాలు.

విండెలు విల్కీగారు 7 వ తేదీన మెయిడ్సన్ స్క్వేరు వద్ద నుపన్యసిస్తూ అమెరికను యుద్ధనౌకల తైనాతీ యొసగి యుద్ధ సామగ్రిని బ్రిటనుకు చేర్చవలసినదని అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమును హెచ్చరించిరి. నౌకాదళ శాఖాధికారియగు కర్నలు నాక్సుగారు గూడ పత్రికా విలేఖరులతో అట్టి యభిప్రాయమునే వెలిబుచ్చిరి. ఈ విషయమై రూజ్వెల్టు అధ్యక్షులు 14 వ తేదీన ముఖ్యమగు ప్రకటన గావింపదలచెను. కాని అది కొన్ని కారణాంతరములచే వాయిదా వేయబడెను. అమెరికా కొలది రోజులలోనే సంగ్రామమున దిగునని 'పాపొలొ డిరోమా' అను ఇటాలియను పత్రిక వ్రాసెను. యెర్రసముద్ర ప్రాంతములకు (ఈజిప్టు సూయజు) అమెరికా నౌకలలో ఆయుధ సామగ్రిని పంపుటకు యునైటెడు స్టేట్సు అధికారులు ఉత్తరువు చేసిరి.

అమెరికా రేవులలోని జర్మనీ, ఇటలీ డెన్మార్కుల నౌకలను యునైటెడు స్టేట్సు ప్రభుత్వమువారు స్వాధీన మొనర్చుకొని ఉపయోగించుకొన బూనుట అంతర్జాతీయ న్యాయశాస్త్రమునకు విరుద్ధమని యునైటెడు స్టేట్సు ప్రభుత్వమునకు జర్మను ప్రభుత్వము 9 వ తేదిన ఆక్షేపణను దెలిపెను. ఈ విధముగ స్వాధీన పరచుకొనబడు అక్సిసు నౌకలను,

బ్రిటనుకు ఆయుధ సామగ్రిని ఆహార పదార్థములను రవాణా చేయుటకుపయోగింపబడునని అధికారులు సూచించిరి.

యునైటెడు స్టేట్సు నౌకాదళ మొకటి ప్రస్తుతము భారత సముద్రమున కావలాకాయుచున్నదనియు, ఎఱ్ఱ సముద్ర మార్గమును కాపాడుటు, జర్మనులు సూయజు రేవు నాక్రమించుచో,—జర్మనీ జపాను నౌకలు కలియకుండ నిరోధించుట—ఈ నౌకాదళముయొక్క కర్తవ్యమని న్యూయార్కు డెయిలీ మిర్రరు వ్రాయుచున్నది.

## దూరప్రాచ్యం.

జపాను సైన్యాలు, చైనాలో పెద్ద దాడులను ప్రారంభించినవి. షన్సీరాష్ట్రంలో యెల్లోనది ప్రాంతాన చైనా సైన్యాలు చంగ్టియావో పర్వతాలలో వున్నాయి. వీనిని తొలగించుట జపానువారి యుద్దేశం. చైనీయుల 40 వ సైనికదళ కేంద్రస్థానమగు పాయుంగ్ అనే పట్టణాన్ని స్వాధీనం చేసుకున్నామని 11 వ తేదీన జపానీయులు ప్రకటించారు. 12 వ తేదీన జపాను సైన్యాలు, కాంటను నగరానికి ఆగ్నేయంగావున్న పోక్లో, వెయిచో పట్నాలను ఆక్రమించెవని యు దీనివలన చైనాకు ఆయుధాలు సప్లయిచేసే మరియొక త్రోవ కట్టివేయబడిందనియు జపాను అధికారులు ప్రకటించిరి. దక్షిణ దిశగా జపానీయులు సాగించు దాడులకు ఫార్మోసా రేవు కేంద్రంగా వుంటుందని ఫార్మోసా గవర్నరు అడ్మిరల్ హిసెగోషిగారు ప్రకటించిరి.

పనినుండి విరమించుకొనుచున్న చైనాలోని యునైటెడ్ స్టేట్సు రాయబారి గౌరవార్థం చుంకింగునందొసగబడిన విందులో, చాంగ్ కై షేక్‌గారు ప్రసంగిస్తూ "చైనాకు డబ్బు, ఆయుధాలు సప్లయిచేస్తే చాలు. జపానును చైనా చూచుకుంటుంది. ఇతరులు జపానుకోసం సైన్యాలు పంపనక్కర్లేదు. నౌకాదళాలను పంపనక్కర్లేదు" అని అన్నారు.

రష్యానుండి యెక్కువ సప్లైలకోసం, జర్మనీ, రష్యాలు—ఆసియాఖండంలో సోవియటులు ఇష్టం ప్రకారం ఆక్రమించుకోవచ్చునని ఒడంబడిక చేసుకుంటే, జపాను చేతులు ముడుచుకొని చూస్తో కూర్చొనియుండదు అని జపాను సైనిక పక్షాల పత్రికయగు "కొకుమిన్" హెచ్చరించింది.

సయాం—ఇండోచైనాలకు సంధియొడంబడిక పైన, ఉభయపక్షాల ప్రభుత్వ ప్రతినిధులును ఈ నెల 8 వ తేదీన, టోకియో నగరంలో సంతకములు చేసిరి. దీనితోపాటు ఆ యుభయ ప్రభుత్వాలు, తాము కలసిగాని వేర్వేరుగాగాని ఇతరులతో, జపానుకు నష్టకరంగావుండే యొడంబడికలను గావించుకొనమని తెలుపుచూ వాగ్దాన పత్రాలను వ్రాసి ఇచ్చారు.

## నౌకా నష్టాలు.

ఏప్రిలు నెలలో మిత్రమండలివారి తాలూకు 4,88,124 టన్నుల పరిమాణంగల 106 వర్తక నౌకలు ముంచివేయబడెనని బ్రిటిషు ప్రభుత్వంవారు 9 వ తేదీన ప్రకటించారు. వీనిలో బ్రిటిషువారివి 60 నౌకలు. వాని పరిమాణం 2,93,089 టన్నులు. ఇతర దేశాలవి 43 నౌకలు. వాని పరిమాణం 1,89,473 టన్నులు. తటస్థ దేశాలవి 3 నౌకలు. వాని పరిమాణం 5,562 టన్నులు.

గత 6 వారాలలోను 600,000 టన్నుల పరిమాణంగల శత్రు నౌకలు ముంచి వేయబడెను.

హిందూ మహాసముద్రాలలో తిరుగుచు వర్తక నౌకలను ముంచివేయుచున్న ఒక జర్మను నౌక 9 వ తేదిన ముంచి వేయబడినది. ఆ నౌక మొదటిలో వర్తక నౌకగా వుండేది. తరువాత యుద్ధ నౌకగా మార్చి ఆయుధాలు అమర్చిరి. దానిలో సుమారు 300 సిబ్బంది వుండవచ్చు. వారిలో 53 జర్మనులు కాపాడబడిరి. ఈ నౌకను ముంచిన బ్రిటిషు యుద్ధ నౌక పేరు "కార్న్‌వాల్".

హిందూ మహాసముద్రంలో, జర్మను నాయుధ నౌకకు సప్లైలు అందించుచున్న కోబర్గు అనే జర్మను నౌకను, దానిచే పట్టుకొనబడిన కెట్టి అనే నార్వేదేశపు నూనెనౌకను, లియాండరు అనే పేరుగల న్యూజీలాండు యుద్ధ నౌక అడ్డగించి ముంచివేసింది. ఆ నౌకలలోని సిబ్బందిని సురక్షితంగానే కాపాడారు.

మిక్కిలి వేగముగాపోవు బ్రిటీషు "క్రూయిజరు" ట్యాంకు



ఈ ట్యాంకులిప్పుడు వందల కొలది తయారగుచున్నవి.

# ఇరాకు రాజ్యం.

## ఇండియాకు రక్షణ బురుజువంటిది.

ఇప్పటి ఇరాకు రాజ్యము గత యుద్ధానంతరం మోసలు, బాగ్దాదు, బాస్రా అను మూడు టర్కిషు రాష్ట్రాలు చేర్చి యేర్పరుపబడింది. బ్రిటనుయొక్క మాండేటు రాజ్యంగా పరిపాలించబడుచుండెను. ఆదివరకు మెసపటోమియా అనబడుచుండెను. దీని విస్తీర్ణము 116,000 చ॥మైళ్లు; జనసంఖ్య. 3,500,000. బాగ్దాద్ దీని ముఖ్యపట్నం. బాస్రా యనునది ముఖ్య రేవు స్థలం. ఇది పెర్షియా గల్ఫునకు 70 మైళ్ల దూరమున యూఫ్రటీసు నదీ తీరాన గలదు. చమురు గనులు ఎక్కువగనుండి, తూర్పు దేశాలకు మార్గమధ్యమున ఉండుటచే, అన్య రాజ్యాలకు దానిపై ఆశ గల్గి ఆదేశంలో చిక్కులు కలుగజేయ ప్రారంభించిరి.

టర్కిషు సామ్రాజ్యము 1911 వ సం॥ నుండి గతయుద్ధ ప్రారంభంవరకు క్షీణ దశయందుండెను. అరబ్బుల జాతీయాభిమానము ప్రజ్వలించి తిరుగుబాటు చేయుచుండిరి. 1914 వ సం॥ లో యుద్ధం ప్రారంభంకాగానే, బ్రిటిషు రాజకీయ ప్రతినిధి అరబ్బు జాతులకు ఒక ప్రకటన గావించెను. యుద్ధంలోనికి జర్మనీ ప్రోత్సాహంవలన టర్కి దిగిందనియు, అరబ్బు రాజులకు, వారి మతమునకు ప్రతికూలచర్యలేవి చేయక, బ్రిటిషు ప్రభుత్వం రక్షణ యొసంగుననియు ప్రకటించెను.

ఈ యుద్ధం తురుష్క మతమునకు పవిత్రమయిన యుద్ధమను టర్కీ ప్రభుత్వ ప్రకటనను ఎవ్వరు నమ్మలేదు. బాస్రా నగరమును టర్కి అధికారులు 1921 వ సం॥ నవంబరులో విడువవలసి వచ్చెను. సర్ కాక్సుగారు బాస్రాను ఆక్రమించి టర్కి రాజ్యమంతరించినదనియు, బ్రిటిషువారు మిత్రులుగను, రక్షకులుగను వచ్చిరనియు ప్రకటించిరి. 1917 వ సం॥ లో బాగ్దాదును బ్రిటిషువారు ఆక్రమించిరి. అపుడు, విదేశీ పరిపాలక వర్గములు అచట స్థాపింపబడవనియు అరబ్బుల ఆశయ తీర్చబడుననియు ప్రకటించిరి. బ్రిటిషు సైన్యాలు ముందుకుపోయి, యూఫ్రటీసు ఉత్తర భాగమును రామాడి వరకు ఆక్రమించి, 1918 వ సం॥ అక్టోబరు సరికి మోసులు ప్రాంతమంతయు వశపరచుకొనిరి.

### ఇంగ్లాండు-ఫ్రాంసుల ప్రకటన.

గత యుద్ధానంతరం, మిత్రమండలి ఆక్రమించిన అరబ్బు రాజ్యాలకు చాల ముఖ్యమయిన ప్రకటనను బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు చేసినవి. "ఇంతకాలం టర్కిచే హింసింపబడుచుండిన ప్రజలను విముక్తిచేసి, దేశీయ ప్రతినిధులుగల పరిపాలకవర్గములను ఏర్పాటుచేయుటే" తమ ఉద్దేశమని దెలిపిరి. సిరియా మెసపటోమియాలందు దేశీయ ప్రభుత్వములను స్థాపింప ప్రోత్సాహించెదమనిరి. అరబ్బు ప్రజలలో తిరుగుబాటు కలిగెను. ఇండియానుండి సైన్యాలను తెచ్చి అరబ్బుల తిరుగుబాటును అణచవేసిరి. హై కమిషనరు సర్ కాక్సుగారు జాతీయ ప్రభుత్వ స్థాపనకు మొదటి కార్యముగ స్టేటు కౌన్సిలును ఏర్పాటుచేసిరి. దానికి అధ్యక్షుడుగ బాగ్దాదులో నాయకుడగు నకిబ్‌గారిని నియమించిరి. అన్ని తరగతుల ప్రతినిధులు ఆ సభలోగలరు.

### ఫైజలు రాజగుట.

మెక్కా రాజగు హుస్సేనుగారి కుమారుడు ఎమీరు ఫైజులుగారిని ఫ్రెంచి అధికారులు సిరియా విడచిపోవలెనని ఉత్తరువుచేయగా, అతడు ఇరాకునకువచ్చి రాజుగా నుండగోరెను. ఇరాకు మంత్రివర్గము అతన్ని రాజుగ 1921 వ సం॥ జూలైలో ఎన్నుకొనిరి. కాని ప్రజాప్రతినిధుల సలహా ననుసరించి పరిపాలించవలెనని షరతువిధించిరి. ప్రజలందరుగూడ నూటికి 96 గురు అతడు రాజుగనుండుటకంగీకరించుచు వోటు చేసిరి. మిగిలినవారుమాత్రం బ్రిటిషు పరిపాలనక్రింద నుండుట కంగీకరించిరి.

ఇంగ్లాండు-ఇరాకు ఒడంబడిక 1922 వ సం॥ అక్టోబరులో జరిగెను. ఇది ఇరువదేండ్లవరకు అమలు జరుగునని అంగీకరించబడెను. 1926 వ సంవత్సరములో మరో ఒడంబడిక జరిగెను. దాని ప్రకారం 1925 నుండి 25 సంవత్సరాలవరకు యీ సంబంధం కొనసాగుననియు, యీలోగా ఇరాకు జాతి సమితిలో సభ్యరాలుగ చేర్చుకోబడితే అది తెగిపోవుననియు నిర్ణయించబడెను.

1924 వ సంవత్సరములో ప్రజానియుక్త సభ ఒక రాజ్యాంగ విధానమును నిర్ణయించుకొనెను. రెండు శాసన సభలును, పరిమితాధికారముగల రాజుగారి బాధ్యతాయుత పరిపాలనము ఏర్పాటుచేయబడెను. 1927 వ సం॥ డిశంబరులో ఇరాకు స్వపరిపాలనమును ఇంగ్లాండు గుర్తించెను. 1930 వ సంవత్సరములో ఫైజులు రాజు చనిపోగా అతని కుమారుడు ఘాజీ రాజయ్యెను. మాండేటు అంతరించినందున, 1932 వ సం॥ అక్టోబరులో ఇరాకు జాతి సమితిలో సభ్యరాలుగ చేరెను. దేశానికి స్వాతంత్ర్యం చేకూరినప్పటికినీ, బ్రిటనుతో సంధి షరతుల ప్రకారం బ్రిటిషు సైన్యం, పోలీసు విమానదళం ఆదేశంలో ఉంటూనేవుంది. ఆధునిక పరికరములతో 28,000 దేశీయ సైన్యం, 10,000 పోలీసుదళం ఆ దేశంలో కలదు. మోసులు చమురు గనులు రాయలు డచ్చి స్టాండర్డు ఆయిలు కంపెనీల వశమందున్నవి. వాటిని హైఫా రేవుతో కలుపునట్టి పైపులు గలవు. ఇరాను సరిహద్దుల చేరువనున్న ఖానాకిను చమురు గనులు ఆంగ్లో-ఇరానియను చమురు కంపెనీ వశమందున్నవి.

### ఇరాకులో ఇటీవలి సంఘటనలు.

1939 వ సంవత్సరములో ఘాజీ రాజు మోటారు ప్రమాదమున చనిపోయెను. అతని 4 సంవత్సరముల కుమారుడు 2 వ ఫైజులు రాజయ్యెను. అతని మేనమామ ఎమీరు అబ్దుల్లా రాజుతరఫున పరిపాలించుచుండెను. హిక్మెటు సులేమాను, బకరుసిడికి అను సేనానాయకులు స్వతంత్రించి దేశంలోనున్న రెండు ప్రజాపక్షములను పరిపాలనాధికారమునుండి తొలగించిరి. కాని బకరు సిద్దికిని ఒక సిపాయి హత్యగావించెను. హిక్మటు రాజీనామా నిచ్చుటచే నూరి సయ్యదు పాషాగారు ప్రవాసమునుండి వచ్చి తిరిగి ప్రధాన మంత్రి అయ్యెను. 1939 వ సం॥ సెప్టంబరులో నేటియుద్ధం ప్రారంభమయినపుడు, ఇంగ్లాండుతో గల ఒడంబడిక ప్రకారం ఇరాకు జర్మనీకి ప్రతికూలంగా ఇంగ్లాండు పక్షమే యుండునట్లు ప్రకటించెను.

నెల రోజుల క్రిందట సయ్యదు రషీదాలి, జాతీయ పక్ష నాయకుడు కొద్దిమంది సైన్యాధికారుల సహాయమున పేరొక కుట్రచేసి నిరంకుశాధికారం స్వీకరించెను. రీజెంటు అమీరు అబ్దుల్లాను పరదేశాలకు పంపివేసెను. చర్చిలుగారు చెప్పినట్లు యీతడు హిట్లరు ఆజ్ఞప్రకారం నడుస్తున్నాడు. బస్రాకు బ్రిటిషు సేనలను ఒడంబడిక ప్రకారం రానిచ్చి, యివి పోతేగాని క్రొత్త సేనలను రానీయనని వారించెను. ఒడంబడిక ప్రకారం ఇరాకులో విమానాశ్రయములను కాపాడుకొనుటకు బ్రిటిషు సేనలను వాటికి సరకు రవానాలను ఇరాకు ప్రభుత్వం అంగీకరింపక తప్పదు. బ్రిటను అతనిమాట తృణీకరించి క్రొత్త సేనను దింపుసరికి రషీదాలి హబ్బానియా విమానాశ్రయం వద్దనున్న బ్రిటిషు సేనను చుట్టవేసెను. దానితో యుద్ధం ప్రారంభమయి, యిపుడు బ్రిటిషు సేనలు విజయం గాంచుచున్నవి.

## హబానియా విమానాశ్రయం.

హబానియా బాగ్దాదునకు 56 మైళ్ల దూరమునందు ఎడారిలో నుండబట్టి అక్కడ బ్రిటిషు విమానాశ్రయం కట్టితే ఎవ్వరికి చిక్కలేదు. దానికి దక్షిణంగా ఒక మైలు దూరమున బాగ్దాదు—డమస్కసు మార్గం పోవుచున్నది. హబానియాను యుఫ్రటీసు నది వరదలనుండి కాపాడవలసియున్నది. ఇంగ్లాండునుండి ఇండియాకు పోవు విమానాలు, ఈజిప్టు విడచినాక హబానియాలోనే దిగవాలి. ఇటునుండి బాస్రాకు పోతాయి. హబానియా సరస్సు రాయలు విమానాల మకాం స్థలమగుటచే ఇంగ్లాండునకు చాల ముఖ్యమయినది.

హబానియాయందున్న బ్రిటిషు సైన్యాలపై రషీదు అలి గుండ్లు వేల్చుట కృతఘ్నతయగును. పాలుపోసి పెంచిన పాము చేయి కరచినట్లయినది. ఇరాకు సైన్యానికి రక్షణయొసంగి, దేశానికి స్వాతంత్ర్యమిచ్చి కాపాడినది ఇంగ్లాండు. ఇంగ్లీషు వారే నీటి మార్గములు, చమురు గనులు అభివృద్ధిచేసి దేశానికి సంపద చేకూర్చిరి. బ్రిటిషు సైన్యాలిపుడా దేశంలో ఉన్నాయంటే, అక్షరాజ్యాలనుండి ఇరాకునకు ప్రమాదం తప్పించుటకే ఉన్నాయి.

## ఇండియాకు రక్షణశిఖరం ఇరాకు.

"ఇరాకునకు ముప్పువస్తే ఇండియాకు వచ్చినట్లే" అని ఇండియాలోని సైనికాధికారులనుకొంటున్నారు. ఇండియాకు పడమటి రక్షణ బురుజుగా ఇరాకు ఎంచబడుచున్నది. రషీదాలిని మంచిచేసుకొని శత్రువు ఇరాకులో స్థావర మేర్పరచుకొనగలిగినచో, తరువాత ఇరాను ప్రవేశించుట కష్టంకాదు. ఇరానునుండి బెలూచిస్థానమునకు ఎంతో దూరంలేదు. బాస్రాలో సామ్రాజ్యసేనలు చేరకుండా వారించుటకే ఇరాకులో రషీదు అలి దౌర్జన్యంగా అధికారం స్వీకరించెనని కొందరు నిపుణులు అంటున్నారు.

ఇట్లా జరుగుతుందనే ముందుగ తెలిసి బ్రిటిషు సేనలకు ఇరాకులో స్వేచ్ఛావిహారాధికారం ఉండాలని సంధిషరతులలో చేర్చబడెను.

ఇరాకును ఆక్రమించే ఉద్దేశం బ్రిటిషు సైన్యాలకు ఎన్నడు లేదని ఇండియాలో సైనికవర్గాలకు తెలియును. కావున సంధిషరతుల ప్రకారం సైన్యాల రవాణాకు సౌకర్యాలు ఖడియుటకొరకు ఎంత సైన్యం అవసరమో అంతే అచట ఉంచబడును.

## హిట్లరు ఉద్దేశాలు.

రషీదాలి, జర్మనీ ఇటలీవారి సహకారంతోనే యీకుట్ర పన్నెననుటకు ఎట్టి సందేహం లేదు. జర్మనులు, ఇటలీవారు, యాత్రలపేరిట పరిశోధనలపేరిట టర్కీమీదున్న యీ దేశం వస్తూనేయున్నారు. బ్రిటిషువారి సేన యెంతయున్నదో రషీదాలి జర్మనీకి ముందుగ యెరుకపరచియుండును. ఆ అంచనాకు మించిగాని వస్తే వాటి నెదుర్కోవాలని; జర్మనీ సైన్యాలు సహాయం వస్తాయని రషీదాలికి జర్మనీ సూచించెను. కాని సమయానికి జర్మను సైన్యాలు రాలేదు.

మాంచెస్టరు గార్డియను పత్రిక వ్రాసినట్లు "ఇరాకు చమురు గనులు మనకు పోవుటవలన అంతనష్టం లేదుగాని అవి హిట్లరు చేతికి చిక్కితే మనకు చాలనష్టం కలుగును. ఇరాకు ద్వారా ఈజిప్టు సూయజులను ఆక్రమించి మనలను మధ్యధరా సముద్రంనుండి తరిమివేయుటకు ఆతడు ప్రయత్నిస్తున్నాడు. బాల్కనుయుద్ధం ముగిసినందున అటునుండి వందలకొలది విమానాలను ఈజిప్టుపై పంపవచ్చని హిట్లరు ఊహించెను. అలగ్జాండ్రియా నౌకాదళకేంద్రం పడిపోతేనే, హిట్లరు ఇరాకు చమురుగనులను వశపరచుకొన్న లాభం పొందగలడు; కావున ఈజిప్టు యుద్ధం పైనే అంతా ఆధారపడియుంది." అని మాంచెస్టరు గార్డియను పత్రిక వ్రాసింది.

## టర్కీ వైఖరి.

రషీదాలికి అక్షరాజ్యాల సహాయం ఎక్కువయితే టర్కీ దిగ్బంధం ఘట్టిపడును. చుట్టు శత్రువులే అవుతారు. అందుచే టర్కీ ప్రభుత్వానికి కొంచెం బెదురుగానే ఉంది. టర్కీలో ఉన్న బ్రిటిషు రాయబారి సర్ నాచిబులుగారు టర్కీ విదేశాంగమంత్రి సరా జొగ్లుగారిని యీ వారంలో కలుసుకొని చర్చించిరి. అరబ్బులు మతయుద్ధం జరుపవలసియున్నదని జర్మనులు ప్రచారం చేస్తున్నారు. కాని యీ యుద్ధంలో మతగురువు ఎవ్వరు నాయకత్వం వహించనందునను, టర్కీలేని తురుష్క మతయుద్ధం యుండదుగావునను, ఎవ్వరు జర్మనీమాట నమ్మడంలేదు. రషీదాలి చర్య ఇస్లాము మతస్థు లెవ్వరికి నచ్చలేదనుటకు ఇండియాలో ముస్లిము నాయకులగు భూపాలునవాబుగారు, గౌ॥ సర్ సికిందరు హయతుఖానుగారు, సర్ మహమ్మదు ఉస్మానుగార్ల ఖండన ప్రకటనలే సాక్షి. ఆతడు ఓడిపోవక తప్పదు. ఆతని విమానదళమును బ్రిటిషు విమానాలు నిరుపయోగం చేసినవి. బ్రిటిషు సైన్యాలు క్రమేణా దేశాన్నంతను వశపరచుకొంటున్నాయి. తిరుగుబాటుదారులకు ఆయుధాలు మందుగుండు చాలవని వారే ప్రకటించిరి. ఇరాకు చిక్కు త్వరలో పరిష్కారమగునని ఇండియా, ఇంగ్లాండులు ధైర్యంగా ఉన్నాయి.

# జర్మనీ యుద్ధాన్ని విస్తరింపకోరుట.

## రషియా అమెరికా వైఖరులు.

ఏపనిచేసిన పూర్తిగ చేయాలి లేకుంటే నాశనం కావాలి. అదే నియంతల లక్షణం. హిట్లరు యుద్ధకార్యాలన్ని ఆకస్మికంగా మెరుపువలె జరిపిస్తాడు లేకుంటే ప్రమాదం సంభవిస్తుందని. ప్రస్తుతం జర్మనీ యూరోపురాజ్యాలన్ని ఆక్రమించింది. కాని చుట్టువున్న ద్వీపాలన్ని—బ్రిటను, జిబ్రాల్టరు, మాల్టా, క్రీటు, సైప్రసు, అలగ్జాండ్రియా, సూయజు కాల్వలు—బ్రిటిషువారివశముందేయుండి, బ్రిటిషు నౌకాదళంచే రక్షింపబడుతు జర్మనీకి చుట్టు గిరిగీచినట్లున్నవి. ఈ గిరికివెలుపల దూరాన తూర్పునందు సింగపూరు, దక్షిణమున ఆఫ్రికా, పడమరను అమెరికా, బాసటగ నున్నవి. అందుచే యీ యుద్ధాన్ని ప్రపంచమంతటికి వ్యాపింపజేస్తేగాని జర్మనీ తాననుకున్న విజయం పొందలేదు. యుద్ధం అన్నిదేశాలకు వ్యాపింపజేయడానికి నాజీప్రభుత్వం గూఢచారులను ప్రయాణీకులపేరిట అన్నిదేశాలకు పంపి కుట్రలు పన్నుతూవుంటుంది. ఈతంత్రం అందరు ఎరిగినదే. తటస్థంగావున్న స్వీడను, ఫిన్లండు, స్పెయిను, పోర్చుగలులను అక్షరాజ్యాల ఒడంబడికలో చేరమని కోరుచున్నది. టర్కీని నిరాక్రమణ ఒడంబడిక చేసుకోమని కోరుచున్నది. రషియాను ఎక్కువగ సహాయంచేయమని బుజ్జగిస్తున్నది. ఈజిప్టును బెదిరిస్తున్నది. ఇరాకులో రషీదాలిని తిరుగుబాటునకు ప్రోత్సహించింది.

రష్యా యీ తంత్రానికి లొంగుతుందా? అదివరకు ఒడంబడిక ప్రకారం రష్యా జర్మనీకి సరకు ఫలసాయములు సప్లయి చేయలేదని, వేరొక వినిమయవిక్రయపు ఒడంబడిక చేసుకొని (అంటే సరకునకు సరకే యిచ్చుకొను యేర్పాటు) అమలుపుచ్చుకొను ఉద్దేశంతో జర్మనీ రాజకీయ వర్తకోద్యోగులు ప్రస్తుతం మాస్కో నగరానికి పోయియున్నారు. రష్యాలో ఎక్కువ గోధుమ పండునట్టి ఉక్రైను ప్రాంతాలను వీలైతే వశపరచుకొనుటకు సరిహద్దులలో జర్మనీ సేనలను సిద్ధంచేసింది. రష్యామాత్రం ఊరుకుంటుందా! జర్మనీ సరిహద్దులలో పోలండు-ఉక్రైను-ఇస్తోనియా ప్రాంతాలలో సైన్యం యెక్కువచేసి లడాయికి సిద్ధంగాఉంది. పరిపాలకవర్గ అధ్యక్షుడు అంటే ప్రధానిగావున్న మాలటొవును, ఆపదవినుండి తొలగించి రష్యా నియంత స్టాలిను తానే ప్రధానిపని గూడ తీసుకున్నాడు. వెనుక లిట్వినాఫు ప్రజాస్వామ్య ప్రభుత్వాలతో త్రెంచుకొని జర్మనీతో సఖ్యతగ నుండకోరినందున అతన్ని విదేశాంగమంత్రిపదవినుండి తొలగించెను. ఇపుడు మాలటొవుగూడ అట్టి అభిప్రాయాలు కలిగియున్నందున అతని అధికారం తగ్గించి స్టాలిను స్వంతంగా బాధ్యత వహించెను. స్టాలిను తొందరపడేమనిషికాడు. జర్మనీ ఒత్తిడి ఎక్కువైతేమాత్రం అపుడు యుద్ధంలో దిగుతాడు. అంతవరకు ఎట్టి ఖచితమయిన విధానం ప్రకటించడు. అంతేకాక అమెరికా యుద్ధంలో దిగబోతున్నది కనుక జర్మనీ దృష్టి అటు మరలుతుంది. అందుచే రష్యా తొందరపడి తాటస్థ్యం విడువ నవసరంలేదని స్టాలిను తలంచియుండవచ్చును.

అమెరికా వైఖరి యెట్లుందో చూద్దాం. అధ్యక్షుడు రూజువెల్టు ఏకార్యం నిశ్చయించినా ముందుగా ప్రజాభిప్రాయం అందుకు అనుకూలంగా మారేవరకు వేచియుండి తన విధానం ప్రకటించును. ముఖ్యమగు ప్రకటనలు కొన్ని గావించి ప్రజాభిప్రాయం అందు కనుకూలంగా పెరగనిచ్చి తరువాత కార్యవిధానం నిర్ణయించును. ఈలోగా పని సాగిపోతూవుంటుంది.

అధ్యక్షస్థానానికి పోటీచేసిన వెండలు విల్కీగారు, ఇంగ్లాండుకి యుద్ధసామగ్రి అందజేయు పూచీ అమెరికాయే వహించి సముద్ర మార్గాలను భద్రపరచుకోవాలనిన్ని తాము తయారుచేయగల నౌకలన్ని యివ్వాలని సూచించేరు. దౌష్ట్యం జరుపుచున్న శక్తుల అమెరికా యెదుర్కొని ఓడించాలని నౌకా దళ మంత్రి కర్నలు నాక్సుగారు ప్రకటించిరి. తరువాత అమెరికా రక్షణ సంఘంవారు ప్రభుత్వంవద్దకు రాయబారమంపి బ్రిటిషువారికి సహాయంగా పంపు సామగ్రి కాపలాకాయుటకు అమెరికా నౌకాదళం విమానదళం పంపి అవసరమైతే జర్మనీతో రాజకీయసంబంధం త్రెంచుకోవాలని సూచించెను. ఎర్రసముద్రవరకు నౌకలు సురక్షితంగా పోవుటకు హిందూ మహాసముద్రంలో కాపలా శిబిరమొకటి అమెరికా యేర్పాటు చేయదలచెను. బ్రిటనుకుపోయే సరకునకు కాపలాగా పోవుచున్నప్పుడు వెంటనున్న అమెరికా యుద్ధ నౌకలు అవి మునిగిపోతువుంటే చూస్తూ ఊరుకుంటాయా; గుండ్లు ప్రేల్చి యుద్ధానికి దిగుతాయి. అటువంటి కాపలావే పంపుటకు అధికారులంతా యిష్టపడి బాహాటంగాచెప్పేరు. కాని ప్రభుత్వ నిర్ణయం యింకా బయటుపడలేదు. ఆ ప్రకారమే నిర్ణయింతురనుటకు సందియంలేదు. అధ్యక్షుడు రూజువెల్టుగారు 14 వ తేదిన యీ విషయం ప్రకటిస్తామనిరి. కాని యింకా సమయం రాలేదని కాబోలును 27 వ తేదికి వాయిదావేసిరి. ఈలోపల సరకు ఉత్పత్తి విపరీతంగా పెరుగుచున్నది. 1,700 పౌనుల బాంబులు మోయగల "వెంజెన్సు" అను క్రొత్తరకం విమానాలు తయారుచేస్తున్నారు. ఇవి ప్రపంచాన్నంతా దిగ్భ్రమ చెందించగలవు. ఈ విషయం తెలిసే 4 వ తేదిన హిట్లరు తన శాసనసభలో ఉపన్యసిస్తు జర్మను ఆయుధ ఉత్పత్తి ఎక్కువ చేయాలని ప్రోత్సాహించెను. జర్మనులు బుద్ధిపూర్వకంగా నిర్మించుకొన్న యూరోపు బందిఖానానుండి బయటకువచ్చి పట్టుబడక తప్పదు. ఈ వేసంగి ప్రమాదం గడచి, అమెరికానుండి నౌకలు, టాంకులు, విమానాలు, ఫిరంగులువచ్చి చేరేవరకు బ్రిటను దాని మిత్రవర్గము పోరుసాగించుచు చివరకు విజయము తప్పక బడయగలవు.

# అమెరికా యుద్ధ మంత్రి ప్రకటన.

## ఇంగ్లాండుకి పూర్తిగా తోడ్పడి గెలిపించడం అమెరికా రక్షణకే అవసరం.

అమెరికా యుద్ధమంత్రియగు స్టింసనుగారు గత వారంలో తమ దేశీయులందరిని యెక్కువ త్యాగములకు సిద్ధపడమని హెచ్చరించుచు, యీ యుద్ధంతో తమదేశం పాల్గొని ఇంగ్లాండు ఓడింపబడకుండ చూచుట, తమదేశ శ్రేయమునకే ఎక్కువ అవసరమని సకారణంగా రుజువుచేసిరి. హిట్లరు దుష్ప్రయత్నాలను వీరు యిపుడు యుద్ధంలోచేరిన దేశాల మంత్రులకంటె యెక్కువ తీవ్రంగా నిరశించిరి. నాజీ ముప్పునుండి తప్పించుకొనుటకు అమెరికా ప్రజలు ఎక్కువ త్యాగాలకు సిద్ధపడవలెనని హెచ్చరించిరి. యుద్ధ మంత్రియే యిట్లు ప్రకటించినందున అమెరికా ప్రజలలో గొప్ప సంచలనము కలిగియుండును. స్టింసనుగారు యీ రీతిగా పల్కిరి :—

"ప్రపంచమంతా గొప్ప ప్రమాదమునకు లోనగుచున్నందున మన దేశరక్షణకు మనమంతా తీవ్రమగు కృషి చేయాలి." ఈ ప్రమాదం నాజీ జర్మనీవలన వచ్చినదని తెల్పుచు జర్మనీలో హిట్లరువర్గంవారు అధికారం వహించిన కొద్దికాలంలోనే ఐదు శతాబ్దముల వెనుకటి పరిస్థితులు ప్రపంచమంతట తెచ్చిపెట్టిరనిరి. జర్మనీలో నిర్బంధ సేవ, సైనిక శిక్షణ ప్రారంభించి అన్యదేశాక్రమణకు గడంగి, యిప్పటికి 13 రాజ్యాలను వశపరచుకొని నిరంకుశంగా పరిపాలిస్తున్నారు. పాశ్చాత్య నాగరికతను యూరోపులో మంటగలిపిరి. తాము అధికారులుగనుండి యితర దేశాల వారంతా బానిసలుగా ఉండు నూతన ప్రపంచ వ్యవస్థను నాజీలు స్థాపించదలచిరి. మానవ హక్కులు, దేశాల హక్కులు, అంతర్జాతీయ న్యాయం, యివన్ని రూపుమాపిరి. చట్టసమ్మతమగు పరిపాలనకు బదులు రహస్యపు పోలీసు పరిపాలన స్థాపించిరి.

### అమెరికాకు ముప్పు.

"నాజీ ఏజెంటులు అమెరికా ఖండమునకు వచ్చి దక్షిణ స్వతంత్ర రాష్ట్రాలలో విమాన మార్గాలు ఏర్పరచుకుని పెనామా కాల్వవరకు ప్రాకుచున్నారు. అమెరికాలోని బ్రేజిలు తీరమునకు దుముకుటకై అట్లాంటిక్ సముద్రం అవతలి ఒడ్డున కొంత ప్రదేశం వశపరచుకొనుచున్నారు. మన ప్రజలలో నాజీ ప్రచారకులు మంచి ప్రచారం చేస్తున్నారు. హిట్లరు తన అన్యాయపుచర్యలను అమెరికాలోగూడ సాగించాలని చూస్తున్నాడు.

"అట్లాంటికు ఉత్తరభాగాలనుండి అమెరికాకు ఎటువంటి ముప్పు రాకుండ బ్రిటిషు దీవులు కాపాడుచున్నవి. అట్లాం

టికు సముద్రంపై బ్రిటిషు నౌకాదళం అధికారం వహించి యున్నందున మనం భద్రంగా యున్నాము. ఆ బ్రిటిషు ప్రభుత్వమే దిగ్బంధంవల్లనో, శత్రుదాడివల్లనో పడిపోతే మనకు బ్రిటిషు నౌకాదళరక్షణ యుండదు. బ్రిటిషుదీవులే పడిపోతే అచటి నౌకాదళ కేంద్రాలు రేవులు శత్రువుల వశమయి, మన దేశ నౌకాదళం శక్తికి జర్మనీ శక్తి ఆరేడురెట్లు అధికమవుతుంది. అపుడు మన నౌకాదళం పడమటి అర్ధప్రపంచాన్ని కాపాడజాలదు. పదినెలల క్రిందనే మనం విమానదాడి రక్షణకేంద్రాలు, సైనికశిబిరాలు కట్ట ప్రారంభించితిమి. ఇపుడుగాని అమెరికా నౌకాదళము ఇంగ్లాండుకి అందజేయదలచిన మందుగుండు ఆయుధాలు సురక్షితంగా చేర్చగల్గినచో, అమెరికానే రక్షించుకొన్నవారమగుదుము. మన నౌకల సహాయం బ్రిటిషువారి నౌకాదళం పడిపోయే వరకు అందజేయకపోతే, యీ అవసాన సమయం మించిపోతే, యికముందు మన నౌకాదళం ఎందుకూ పనికిరాదు. మనంపంపే సరకు అట్లాంటికు సముద్రంలో మునిగిపోతూ ఉంటే చూస్తూ వూరుకుంటామా? గత యుద్ధంలో సముద్రాల స్వాతంత్ర్యం భంగమయినపుడే అధ్యక్షుడు విల్సను యుద్ధంలోదిగెను. అమెరికాను రక్షించుటకు అవసరమయితే ప్రాణాలు త్యజించుటకుగూడ సిద్ధపడితేగాని, అమెరికా రక్షింపబడదు.”

అని యుద్ధమంత్రియే ప్రజలను హెచ్చరిస్తున్నపుడు, అధ్యక్షుడు రూజువెల్టు అభిప్రాయంకూడా యిలాగే ఉన్నపుడు, యింకా అమెరికా యుద్ధంలో చేరకుండా దీర్ఘకాలం వేచియుండునని ఎవరనుకోగలరు?

## హిట్లరు ప్రధానబంటు హెర్ హెస్ ఇంగ్లాండు చేరుట.

### యుద్ధంలో “విభీషణ శరణాగతి” ఘట్టం.

హిట్లరు తానుచస్తే తరువాత గోరింగు ఆ తరువాత హెర్ హెస్ జర్మనీ నాయకులుగ ఉంటారని యిదివరకు ప్రకటించెను. ఆ హెర్ హెస్ గారే యిప్పుడు ఇంగ్లాండునకు వచ్చి శరణుజొచ్చెను. ఈతడు హిట్లరుకి నమ్మినబంటు. అన్ని దేశాలకు హిట్లరు తరఫున రాయబారిగ యీతడు పోవుచుండెను. ఇతనియందున్నంత నమ్మకం యింకెవ్వరిలోను హిట్లరుకిలేదు. అట్టి యీతడు 10 వ తేది రాత్రి ఒంటరిగ విమానంలో 800 మైళ్లు ఎగిరివచ్చి స్కాట్లండులో ఒక మిత్రుని యింటికి మైలు దూరంలో గాలి గుమ్మటంలో దిగెను. ఈతడు జర్మనీనుండి పారిపోవుటకు కారణమేమిటి?

జర్మనులు యిందుకనేక అబద్ధాలు సృష్టించి రేడియో ద్వారా చెప్పుచున్నారు. అతనికి పిచ్చి ఎత్తిందని ఏదో భ్రమలోపడి అనేక జోతిష్యము, సమ్మోహన సాధనములను అభ్యసించుచుండెననియు అందుకే అతనికి అధికార బాధ్యతలను తగ్గించబడినవనియు చెప్పిరి. అతడు విడచిపెట్టిన కాగితాలనుబట్టి,తాను స్వయంగాపోయి ఇంగ్లాండు-జర్మనీలకుసంధిచేయగలనను ఆశకూడాకలిగియుండెనని తెలుస్తున్నాదన్నారు. ఇవన్ని జర్మనుల విపరీతపు ఊహలు. వెంటా ఒక దేశపటం తెచ్చుకొని అందులో మార్గం గుర్తుపెట్టుకొని దిగాలనుకున్నచోటికి సరిగా మైలుదూరంలో దిగిన అతడికి పిచ్చేమిటి. నిజమేమై ఉంటుందంటే, హిట్లరుకి అతనికి అభిప్రాయ భేదాలువచ్చి యింక ఆ దేశంలోవుంటే చావు తప్పదని భయపడివచ్చేడు. అతని పలాయనంవలన హిట్లరు కార్యక్రమంలో ఏమి మార్పుండదని జర్మనులు ప్రకటించినా అతడేమి రహస్యాలు శత్రువులకు బయలుపెడతాడో అనే భయంవారికి లేకపోలేదు. డఫ్ కూపరు బ్రిటిషు మంత్రి తెలిపినట్లు హిట్లరు ప్రాణస్నేహితుడు కుడిభుజంవంటివాడు ప్రాణాలకు తెగించి ఆదౌర్భాగ్యదేశాన్ని విడచి స్వతంత్ర దేశానికి రావడంలో ఏదో విశేషం లేకపోదు. అతడిపుడు ఇంగ్లాండులో క్షేమంగా ఉన్నాడు. అతని పలాయనాన్ని వారించలేకపోయినవారు జర్మనీలో ఉరితీయబడుచున్నారు.

## అబిసీనియా చక్రవర్తి—చర్చిలు సందేశములు.

### మొదట పదచ్యుతుడైన రాజు మున్ముందు పట్టాభిషిక్తుడయ్యెను.

అబిసీనియా చక్రవర్తియగు హెయిలి శలాషిగారు తిరిగి తన అడిసుఅబాబా నగరమున రాజ్యాభిషిక్తుడయిన పిదప బ్రిటిషు ప్రధాని చర్చిలుగారికి కృతజ్ఞతదెల్పుచు, తమ దేశ దాసత్వ విముక్తికి తోడ్పడిన సామ్రాజ్య సైన్యములన్నింటిని ప్రశంసించుచు తమ కృతజ్ఞత ఆయా సేనానాయకులకు తెలుపవలసినదిగా చర్చిలుగారిని కోరిరి. బ్రిటిషువారి విజయమునకు అబిసీనియా సేనలు యికముందుగూడ తోడ్పడగలవనిరి. చర్చిలుగారిట్లు బదులు సందేశమంపిరి :—

“మీ సామ్రాజ్య ముఖ్యపట్నమునందు మీకొసంగబడిన స్వాగతమునకు బ్రిటిషు జాతియు సామ్రాజ్యమును మిగుల సంతసించుచున్నవి. సింహాసనమునుండి తరిమివేయబడి ఇపుడు జయప్రదంగా సింహాసనమును తిరిగి అధిష్టించిన ప్రథమ పాలకులుమీరే. దుష్టశక్తులు తరిమివేయబడిన పిదప మీ రాజ్యంలో శాశ్వతంగా శాంతి సంపదలు చేకూరగలవని బ్రిటిషు ప్రభుత్వంవారు ఆశిస్తున్నారు.”

### హవల్దారు గణపతి రాం.

భారతీయ సైనికులను అబిసీనియా చక్రవర్తి పొగడుటకు కారణం లేకపోలేదు. వారు అనేక ఘనకార్యములుచేసి శౌర్య ప్రతాపములను జూపియుండినట్లు, ఆ సైన్యంలోని ఒక హిందూ ఉద్యోగి స్వయంగా చూచినవాడు చెప్పెను. తనతోడి సైనికులు శత్రువుల మర ఫిరంగులచే చంపబడుచు తమదాడి అరికట్టబడినపుడు, హవల్దారు గణపతి రాంగారు చేతిబాంబులుకొన్ని ఒక ఫిరంగిని చేతపట్టుకొని ముందుకుపోవుచు, శత్రువులు దాగియున్న మరఫిరంగి గోతులవద్దకు చాటుగబోయివారినిచంపివారి మర ఫిరంగులు ప్రేలకుండా చేయుచుండెను. ఆ విధంగా యీతడెన్నో సారులు చేసినందుకు ఇండియను ఆర్డరు ఆఫ్ మెరిటు బహుమతి యీతనికొసంగబడెను.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,